# సగౌరవంగా...

ప్రతి వ్యక్తి తన జీవితంలో ఎంతో కొంతమందిని తప్పకుండా అభిమానిస్తాడు, ఆరాధిస్తాడు. రాగ, ద్వేషాలు లేవని చెప్పుకునే విరాగుల్లో కూడ వారి అంతరాంతరాల్లో కొంతమందిపై యిష్టం గూడు కట్టుకుని వుంటుంది.

ఇష్టాన్ని లేదా గౌరవాన్ని సమయం వచ్చినప్పుడు తనకు తెలియకుండానే ప్రదర్శిస్తాడు. ఎన్నాళ్ళుగానో, ఎన్నో ఏళ్ళుగా తన అభిమానానికి పాత్రులై తానెంతో గౌరవించిన పెద్దల్ని, మిత్రుల్ని, పిన్నల్ని "మాన్యశ్రీ"లుగా ఈ సంపుటిలో పొందుపరిచారు శ్రీ బి. వి. నరసింహారావుగారు.

ఇతరుల మంచితనాన్ని పెంచి, పంచే వ్యక్తి ఆ మంచి వ్యక్తుల మంచితనాన్ని మరో పదిమంది మంచివాళ్ళకు పరిచయం చెయ్యకుండా వుండలేడు. అందుకే 'బాలబంధు' గారు ఈ సంపుటిని వెలువరిస్తున్నారు. ఈ పుస్తకంలో చోటుచేసుకున్న మాన్యశ్రీ లందరూ విభిన్న రంగాల్లో, వివిధ ప్రవృత్తుల్లో తమదైన గొప్పను కూడగట్టుకున్నవారేనని నిస్సందేహంగా చెప్పవచ్చు.

తెలుగు సాహిత్యంలో చలానిదో ప్రత్యేక శైలి. శ్రీశ్రీదో ప్రత్యేక బాణి. లతకో ప్రత్యేక స్థానం అలాగే 'బాలబంధు' గారు తమదైన 'ప్రత్యేకత' ను ఏనాడో గడించారు. పెద్దల్లో పెద్ద పిన్నల్లో పిన్న ... అరవయ్యేళ్ళ వారితోనూ, ఆరేళ్ళ వారితోనూ ఆనందంగా కాలక్షేపం చెయ్యగలిగిన దిట్ట.

ఎటొచ్చీ మీకో సందేహం రావచ్చు. బి. వి. గారి లాంటి పెద్దకు పరిచయ వాక్యాలు రాసేందుకు 'నీ కేమిటి అర్హత' అని నన్ను ప్రశ్నించేందుకు మీకు పూర్తి అధికారం ఉంది. ఇదే ప్రశ్న నేనే ఆయనకు వేశాను. ఆయన చిరునవ్వు నవ్వారు. సమాధానం లేదు.

ఈ పుస్తకం గురించి నాలుగు ముక్కలు రాయమని తిరిగి అడిగారు. ఇహ నాకు వారి ఆజ్ఞను కాదనటం సాధ్యంకాని పని.

అందుకే ఈ ధైర్యం చేశాను. ఇది ఒక విధంగా నా అదృష్టం.

[signature]

కార్యవర్గ సభ్యుడు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ

# అభినందనము

' మాన్యశ్రీలు ' రచించి, నీ విటుల సమ్యగ్దృష్టి నీక్షించి, స
న్మాన్యుండౌ ముసునూరి వంశ్యుఁడు జగన్నాథుండె నీ కావ్య స
త్కన్యా రత్నముఁ గొంట కర్హుడని వేడ్కన్ వాని కీవిచ్చుటన్
ధన్యుండైతి నృసింహరాయ ! పతియున్ ధన్యుండు ముమ్మాటికిన్.

ధాత్రిన్ నీవిల బాలబాలికలలో దైవత్వమున్ గాంచు స
త్పాత్రత్వ ప్రతిపత్తి వైభవముచేఁ దాదాత్మ్యమొప్పన్ దివా
రాత్రంబుల్ భజియించు నీ హృదయ నిర్వ్యాజానురాగంబు, నీ
యాత్రంబున్ మదిమెత్తు వీ. వి. నరసింహా ! నీకు జోహారువుల్.

' నాట్యకళా ప్రపూర్ణుఁడవు ' నాట్యము వేదము, దాన నీదు ప్రా
కట్యము మున్నెఱుంగుదు, నఖంతయశోధనుడీవు, సుంత కా
పట్య మెఱుంగ నట్టి పసిపాపలె వేల్పులటన్న ప్రత్యయా
త్కాట్యము ' బాలబంధు ' బిరుదంబును దెచ్చె నృసింహరాట్సుధీ !

ఇట్లు
శ్రేయోభిలాషి
' అభినవ రామకృష్ణ ' ' కవి చంద్ర '
**అద్దేపల్లి లక్ష్మణస్వామి**

# అంకితం



'మాన్యశ్రీ' ముసునూరి కులాబ్ధి సోమ
మధుర మంజుల మార్దవ గుణ ధామ
శ్రీ జగన్నాథ రాయ
రసిక జన ప్రియ
ఈ కావ్యము నీకై తెచ్చితి
గౌరవముతో నీ కిచ్చితి
ఆదరమున గైకొమ్మా
అనూన స్నేహము నాకిమ్మా

-బాలబంధు

# బాపు

అన్నాడు అన్నాడు బాపు
అందరు ఒకటన్నాడు :
అందరు మానవు లన్నాడు
అందరు సోదరు లన్నాడు.

మనిషిని మనిషిగ చూడకుంట అది
మహా నేరమన్నాడు
మనిషిని మనిషే చంపుకొంట అది
మహా ఘోరమన్నాడు.

మతమూ కులమూ తేడాలు అవి
మనలో వలదన్నాడు
మానవులంతా కలిసి బ్రతికితే
మంచియె కలదన్నాడు.

సేవకు అంకితమైతే మనిషికి
చెరుపే లేదన్నాడు
పదవీ వ్యామోహంలో పడితే
పంకిలమౌ నన్నాడు.

పవిత్ర మానవ ప్రతి హృదయమ్మొక
పాఠశాల యన్నాడు
సత్యాహింసలు చక్కగ నేర్చి
శాంతి బడయు డన్నాడు.

# చాచా నెహ్రూ

'గులాబి మొగ్గలు
గులాబి బుగ్గలు'
గురుతుగ నిలిచెను నెహ్రూ మన
గుణములు మలిచెను నెహ్రూ.

పరాభవమ్ము
జరా భయమ్ము
పట్టి నెట్టె మననెహ్రూ, జగ
జెట్టి యతడు మన నెహ్రూ.

జగాన శాంతి
మొగాన కాంతి
నించెను పండిత నెహ్రూ, విరి
యించెను పండిత నెహ్రూ.

తగవులు పగలూ
దారుణాగ్నులూ
తీర్చెను ప్రియతమ నెహ్రూ, చ
ల్లార్చెను ప్రియతమ నెహ్రూ.

మమతా సమతా
మంచి మానవత
పెంచెను చాచా నెహ్రూ, కళగా
నెంచెను చాచానెహ్రూ.

# పొట్టి శ్రీరాములు

ఆంధ్ర ప్రదేశమ్ముత్త
అవతరించిన దినము
పట్టండి జోహార్లు
పొట్టి శ్రీరాములుకు.

అణువణువు తన మేను
అంతలంతలు వ్రేల్చి
అగ్నిలో సమిధగా,
ఆత్మాహుతి యొనర్చె.

ఆత్మ బలిపీఠాన
ఆంధ్ర మాతను నిల్పి
అమరుడైనాడు, మన
కారాధ్యుడైనాడు.

అతని త్యాగము గన్న
ఆ శిబియు తలవంచు.
శిలువపై ఆ క్రీస్తు
చిన్నవోయి చలించు.

ఆ యఖండ జ్యోతి
ఆ యనంత విభూతి
ఆంధ్ర జన హృత్సీమ
అక్షయంబై వెలుగు.

# గురజాడ

( చిరంజీవి, బి. ఏ. )

తెలుగు నేల చాల పొడవు
తెలుగు జాతి చాల పాత
క్రొత్త వెలుగు ఒకడెరా
క్రొత్త మనిషి ఒకడెరా.

'దేశమంటె మట్టికాదు
దేశ మంటె మనుషుల' నెడి
తెలుగు మాట ఒకడెరా
తెలియ జెప్పె నొకడెరా.

ముత్తెమంత పలుకులోన
సత్తెములను మెరుగుదిద్దు
శిల్పితనము ఒకడెరా
చేత మలిచె నొకడెరా.

మంచు జడుల ముసకవిడిన
మధురవాణి మరుగుపెడద
కనుల నిలిచె నొకడెరా
కనులు కలము ఒకడెరా.

పుత్తడి పూర్ణమ్మ బొమ్మ
చిత్తము నెరియించు కొమ్మ
బొమ్మ బ్రతుకు ఒకడెరా
బొమ్మ వ్రాసె నొకడెరా.

కంటి ఎరుపు మింట నలమి
మంటి గరచె రాచరికము
తెలుగు కన్నె ఒకతెరా
తెలుగు తండ్రి ఒకడెరా.

ఆ ఒక్కతె తెలుగు కవిత
ఆ ఒక్కడె తెలుగువాడు
తెలుగు నేల కొక్క జాడ
తెలుగువారి గురజాడ ॥

# శ్రీమతి భాగవతుల సుందరి

అమ్మా ! జానకిని గన్న అమ్మా ! సోదరి ; సుందరి
అందుకొమ్మ ఈ దామము అక్షర సుమదామము
అంతర్జాతీయ బాల లందరికిది ముఖ్యమైన
వత్సరమని మదిని ఎంచి, వ్రాసినావు ఈ కావ్యము.
రంగులు రాగాలుగా రాగాలే రంగులుగా
రూపాంతరమగుననీ, నిరూపించితివమ్మా !
కల్లా కపటం తెలియని కుళ్లా కుచ్చిత మెరగని
పసిపాపల మనసు నీది పసిపాపల పలుకు నీది.
అర్థము కావట్టిదేది ఆచరించి ఎరుగవమ్మ
ఆచరించి నట్టిదేది ఆక్షేపణ కానిదమ్మ.
అభిమానము ధనము నీకు అనుపమ సేవయు ధర్మము
ఎవరికైన ఎందుకైన ఎన్నడు నొప్పించవమ్మ.
పెద్దలలో పిన్నవమ్మ పిన్నలలో పెద్దవమ్మ
తల్లి బిడ్డను నీలో దర్శన మిచ్చితివమ్మ ॥

# తాపీ ధర్మారావు

కావ్య కళా పయ స్సింధు
కమ్మని మా కవి బంధూ !
అందుకోవయా బాబయ
అక్షర కుసుమాంజలి దయ.

గిడుగు పిడుగు గురజాడా
కట్టమంచి, కవిరాజూ
మెట్టిన శిఖరాల ఎత్తు
మేరు పర్వతము నీవు.

చేమకూర వెంకటకవి
చేసికొన్న పుణ్యఫలము
విజయ విలాసమునకు నీ
వివరించిన వ్యాఖ్యానము.

సాహితీ రణమ్మున నీ
సారించిన క్రొత్తపాళి
వెలారించు కుంచె నేడు
వెండి తెరకునై రంగులు.

నీవే ఒక మహోద్యమం
నీ కెవరూ లేరు సమం
కావ్య కళా పయస్సింధు
కమ్మని మా కవి బందూ !

# బడేటి

( శ్రీ బడేటి వెంకట్రామయ్య )

తెలుగు తల్లి బిడ్డలలో మేటి !
తిరుగు లేని ధీశాలి బడేటి ! !
నీవలె నిముసము బ్రతికినచాలు
నీ కివె మా భక్తి ప్రణామాలు ॥

జాతికి జీవము పోసినవాడా
నీతికి నివాళులెత్తిన రేడా
లేరు లేరు నిను పోలగలారు
లేరు తెలుగు మాగాణము నెవరు.

కాసులేని ఒక పేదకు పుట్టి
ఘన గౌరవ పదవుల చేపట్టి
నీతీ న్యాయం భువి నిలబెట్టి
ఖ్యాతి బడసితివి ఓ జగజెట్టి ! !

నిన్ను గన్న తలిదండ్రులకన్నా
మిన్న లెవరు ధన్యత నోయన్నా
పుట్టిన తావును మెట్టిన తావును
పునీతమొనర్చినావు నీవు ॥

పట్టుదలకు నివు పెట్టిన పేరట
గట్టి పనులు చేపట్టి విడువవట
కన్నులలో కెంజాయ తొణకదట
కారుణ్యము నీ సహజ గుణమ్మట.

అల్ల నల్ల మెట్లెక్కి పైపైకి
అందుకొన్న గౌరవము బిరుదులూ
సాటిలేని నీ మేటి ప్రతిభకు
సమ్యగ్దృష్టికి నిదర్శనమ్మట.

స్వయం శక్తిచే పైకివచ్చుటయు
స్వతంత్రభావాల్ వెలిబుచ్చుటయు
మాట ఇచ్చి మరి తప్పకుండుటయు
ఓటమి నెన్నడు ఎరుగ కుండుటయు
హేలాపురి నీపాలనమ్మునూ
గౌతమీ మండలాధిపత్యమును
శాసన మండలి సభ్యత్వమ్మును
సర్వజనత్వము సమయజ్ఞత్వము
పెంకె తనమ్మును, మహోదారతయు
ప్రేమమందు ఘన త్యాగశీలతయు
గురువును మించిన గొప్ప గుణమ్ములు.

చదువూ పనపూ ! మాటా మనికీ
నీతీ నియతీ ! ఓర్పూ తీర్పూ
మమతా సమతా ! శ్రద్ధా బుద్ధీ
అందరికీ నీవన్ని నేర్పితివి

నీ వెలిగించిన జ్యోతులు భువిపై
నిలిచి కాంతి విరజిమ్మును మాపై ! !

# కొత్త రాజబాబయ్య

చిత్తశుద్ధి గల పంతులయ్య శ్రీ
కొత్త రాజ బాబయ్య !
ఉత్తమాదర్శ ఉపాధ్యాయుడుగ
ఉన్నత గౌరవ సత్కారము గొనె...

మనిషి వైఖరి మెత్తన పైకి
మనసు నిర్ణయము గట్టి లోపల
అందుచేతనే అతని సత్కృషికి
అజరామరమగు ఖ్యాతి ఘటిల్లె

విద్యా ప్రాంగణ మందు నెలకొల్పె
విశిష్ట వినూత్న సంప్రదాయములు
గురు పారంపర్యమనే దొక్కటి
గురుతుగ నిల్పె నుపాధ్యాయులలో

అతని ఖ్యాతి గౌరవము అందరిది
దీక్షా దక్షత తిరుగు లేనిది
శిక్ష విడక క్రమశిక్ష గరపుటది
అతనికి అతడే సరి యనదగినది

అతని జన్మ చరితార్థ కారణము
అతని సతియు సంతతియు ప్రేరణము
నిక్కముగా ఆ వ్యక్తి ప్రభావము
నిలుచును ప్రతి గుండె లోను దండిగ !!

# చలసాని లక్ష్మినారాయణ వర్మ

కర్షక కవి శ్రీ చలసాని
లక్ష్మినారాయణ వర్మ
కనకమునే పండించుకొన్న
కన్న కడుపు తన సుకర్మ

ప్రశాంత సుఖమయ జీవితము
పండిత జన సుస్నేహము
ఎంచుకొన్న మంచి మనిషి
ఎన్నదగిన మహా ఋషి

ఆతని అల్లుడు కూతురు ఇద్దరు
అకలంకమైన వైద్య సేవకు
అంకితమై ప్రఖ్యాతి గాంచిరి
అందరినీ దయ నాదరించిరి

కాసరనేని సదాశివరావు
ఘన యశస్కుడు అల్లుడు
జయప్రదాంబ కూతురు మా
ప్రియ సోదరి దయామతి !!

# డాక్టరు పాటిబండ్ల
# దక్షిణామూర్తి

పాటిబండ్ల శ్రీ దక్షిణామూర్తి
పరమ శాంత కరుణా ప్రకీర్తి
దేవుడైన ఒక దివ్య మానవుడు
తీరిక నెరుగని వైద్య సేవకుడు

మాట ముందుగా మమత విందుగా
సాటి లేని ప్రతిభ రోగులను
సర్వవేళ సేవించుటది నేత్ర
పర్వముగా నా కగుపించు

వైద్యవృత్తి చే పట్టిన వ్యక్తి
వందన్నొక పనులం దనురక్తి
ప్రదర్శించి స్వధర్మ నిర్వహణ
పాటించుట యది ఘనమగు శక్తి

కవులన్నా కళలన్నా జనహిత
కార్యములన్నా అభిమానించు
సన్మానములూ సంస్కృతి క్రియలు
సమ్మతిని సదా నిర్వహించు ॥

మాట మెత్తనిది మనసు మెత్తనిది
మల్లెకన్న తెల్లనిది హృది
రోగ నిదాన నివారణ మందు
లందె వేసినట్టి చేయి తనది !!

# గుర్రం జాషువ
# తుమ్మల సీతారామమూర్తి

**కవితా**

పారము నందిన ఘనులు అ
పార శేముషీ ధనులు
సార సంస్కార భావోదారులు
సకల సౌజన్య సన్మానార్హులు ॥

భావోన్నతి భవ్య వినీతి
సంఘ సమాదృతి సారధృతి
కందళితము మీ కవితా మంజరి
కాల దేశముల కతీతాకృతి ॥

ఒకరు పోతన్న ఒకరు తిక్కన్న
సకలశబ్ద పరిపుష్టికి, శుద్ధికి
భావ లాలిత్య కవిత వేదనకు
భావ గాంభీర్య ధర్మబోధనకు ॥

మాతృ భాగముగ పితృ భాగముగ
మాకు మీ తత్త్వము కవిత్వము
అర్ధనారీశ్వ రాకృతిని బొల్చి
అఖిల మంగళ శ్రీ నందించు !!

# గొర్రెపాటి వెంకట సుబ్బయ్య

అందుకొమ్ము అభివాదము
అక్షరా భివాదము
బాబయ శ్రీ సుబ్బయార్య
ప్రవిమల గుణధుర్య !

ఉల్లము ఉడుపులు తెల్లన
మాటా మనుగడ మెల్లన
అందరికీ విడిది యైన
నీ హృదయము చల్లన ॥

ఆచి తూచి మాటలాడు
అందమైన తీరు నీది.
మమతా మానవతా గల
మధుర జీవనము నీది

మహా మహుల జీవితాలు
మా కన్నుల గట్టినావు
ఆచరణా శిల్పములో
అందె వేసి నట్టి నీవు.

బంధు ప్రీతి నందరితో
బాంధవ్యము గల బాబు
దర్జా రీవి దర్పం
ధరియించిన నవాబు!!

# కవిరాజ ప్రశంస

తెలుగు నేల పెద్దది
తెలుగు జాతి దొడ్డది
తెలుగు వారి కొక రాజు
ధీరుడు మన కవిరాజు.

దేశమున విదేశమున
వాసిగ తన ప్రత్యేకత
నిలుపుకొన్న ఘను డుదాత్త
నిర్మల చరితుడు విజ్ఞుడు.

మన మాతని వారసులం
అను మాటకు నిదర్శనం
అతని బాధ అతని బోధ
అణువణువున గ్రహింతము.

కులమతాల ముసుగు చాటు
కుహనా వేదాంతు లనెడి
మాయా జాలరుల బట్టి
మటుమాయ మొనర్చె దిట్ట.

దేవుని పేరిట మోసము
దివ్యముగా సాగు నేడు
దీనికి విరుగుడు కవితా
ధీ శక్తిని చూపినాడు.

తెలుగునాట కవిరాజుకు
వెలుగుబాట నడచు కర్మ
వీరులు ధీరులు శిష్యులు
ఊరూరా కలరు వేలు.

కమ్మని తెలుగున ఉత్తమ
కావ్యాలను రచించి
జాతిని మేల్కొల్పి దివ్య
ఖ్యాతి నిల గడించినాడు ! !

# జయంతి సత్యనారాయణమూర్తి

మనశ్శాస్త్ర మహా పాదోనిధి
మామక గురు మహా దయాంబుధి

జయంతి సత్యనారాయణమూర్తి
జగద్విదిత బోధనా ప్రకీర్తి

నా యెడ నా నాట్యకళ యెడ
ఆతని కేర్పడిన అభిమానము
అనూన మపార మద్భుతము

జీవితాంతము గురుదేవుని నే
భావింతును ఎద భక్తి ప్రపత్తిని.

# గార్లంక వీర వేంకట సత్యనారాయణ

గురు శబ్ద ప్రతిపాదిత గుణ విశేష ధీవర్యులు
గార్లంక వీర వేంకట సత్యనారాయణార్యులు
మనసున మాటను మనికిని మహదాశయ సంపన్నులు
అందరి మన్నన గౌరవ మందుకొన్న ప్రపన్నులు ॥

అనుష్ఠానవేదాంతులు ఆత్మగౌరవోన్నతులు
బుద్ధిలోను బోధలోను బృహస్పతియు గౌతముడును.
అమ్మను విశ్వమ్ములోని అణువణువున దర్శించిన
అనుపమ సత్యాన్వేషులు అతి దయార్ద్రి మృదు భాషులు
గురు పరం పరౌక దానికి గురువు గుర్తు
రామకృష్ణ పరమ హంస వలె తాను:
అరయ సుబ్బరాయు డాదర్శ శిష్యుడు వివేకానంద డటు.

మమతా మాన్యతలను ప్రతి మనిషిలోను పాదుకొల్పి
మంగళ కార్యాచరణ సమాయత్తుల జేసినారు
శిష్యతతికి అమృత పద విశేష మార్గ మందించిరి
అవిరళముగ అనంత ప్రస్థానమ్మును సాగించిరి
ఉన్నత ఉన్నత పథాన తిన్నని తిన్నని విధాన
జీవితమును మలచుకొన్న జీవన శిల్పులనల్పులు

ఉదారాశయ శీలమును సదాచార వర్తనమును
కలిగిన పరతత్త్వ మార్గ గాములు ప్రణుతస్వాములు
వెలిగించిరి జ్ఞానజ్యోతి వెలుగై తా వ్యాపించిరి
నాటికి ఈ నాటికి ఏనాటికి కడు దీపించిరి.

# కాళోజీ

అన్నా ! కాళన్నా ! నీ షష్టిపూర్తి యని విన్నా
మాటల పాటగ నీ కీ మాల గట్టి ఇస్తున్నా.

పోతన్నా సూరన్నా పోలరు నీతో అన్నా
వేమన్నే దీటు నీకు వేయి ముఖము లున్న బాకు.

రామోజీ లక్ష్మిజీ సౌదర్యం కన్న అన్న
రామోజీ కాళోజీ సౌదర్యం మిన్న.

ముత్తె మంత పలుకుల్లో సత్తెము ప్రవచించినావు
కత్తి కలంతో ధూర్తుల కుత్తుకలను త్రుంచినావు.

'నా గొడవ' ని నీ వనేది నరనారీ జనానిది
దానిని తీర్చే బాధ్యత ధర్మం నీ యది.

పీడిత తాడిత జనాల గోడు నీకు ఆవేదన
అందు కొఱకు చేయుచుందు అనారతము రచన.

జిబ్రాన్ నీ కభిమానం చలం నాకు అభిమానం
జిబ్రాన్నీ విస్తివి నే చలాన్నీ కిస్తిని.

భాషలలో దిట్టవు బహు భావాలకు పుట్టవు
చౌక బారు స్తుతులు నీకు ససేమిరా గిట్టవు.

పంతాలూ పగలూ నీ చెంత జేర వెన్నడు.
దేవుణ్ణయినా సరె నీ 'దేహీ' యన వెన్నడు.

ధీరునిగా వీరునిగా దివ్యమైన ప్రజాకవిగ
నిలిచిన నీ కిదె గౌరవ నీరాజన మిస్తున్నా!

# వేగేశ్న సత్యనారాయణరాజు

మీ చిరునవ్వే వెన్నెల
మెరిపించెను మా కన్నుల
రసమురల్చు తేనె పెరా
పసివాడని రాచదొరా ॥

ఐదు పదులు లెక్క చూస్తె
అష్టక మా పైనవేస్తె
అందుకొన్న వసంతాలు
అర్ధనూట పదహారులు

అడగనిదే లోపము మి
మ్మడగని వారిది పాపము
అంతులేని మీ ఈవికి
అదే కదా ఒక రూపము

అనురాగం మారుపేరు
అక్షరాల మీదు తీరు
అంతులేని అమృత సరసు
ఔను మీ ప్రసన్న మనసు

మంచి మంచి ముత్యాలు
పంచిన మీ గౌరవాలు
అందరిలో వెలుగు మేలు
అదే మాకు ఆనవాలు.

# డాక్టర్ ఆర్. ఏ. జాకబ్

పంచ ప్రాణముల ప్రేమ
పంచి యిచ్చు మంచి మనిషి
రూబియమ్మ డాక్టరమ్మ
రుణము దీర్ప తరమ్మ!

వయసులోన భేదము ర
వంత యైన కానరాదు
మనసులోన భేద మిసు
మంత యైననూ లేదు!

ఆటలన్న పాటలన్న
అందమైన కళలన్నా
వినోదములు వేడుకలూ
విందులన్న విసుగు సున్న!

కన్న కడుపు కాదు నిజము
కనికర మూమెకు నైజము!
దిక్కు లేని దీన జనము
దేవుడిడిన సంతానము!

ఎప్పుడైన ఎక్కడైన
ఈమె కీర్తి నిలిచే నన
అందరిలో వెలుగు మేలు
అదే మనకు ఆనవాలు!

# శ్రీమతి చావలి బంగారమ్మ

అమ్మ బంగారమ్మ ఆ కొండ మాకమ్మ
చల్లన్ని దయ మము సతము సాకిందమ్మ :

చుక్కలను చక్కనివి మక్కువతో దండగా
గ్రుచ్చి నాధుని మెడను గోముగా వేసినది.

కాకి కోవెల తీరు గణుతించి మా కొక్క
వెయ్యమున మెలగేటి నీతి నేర్పినది.

వేదనకు గురియై నివేదనకు గుర్తునై
రాధగా ప్రేమ కారాధనగ వెలిగినది.

అమ్మలో బాల్యమ్మ అణు వణువు స్పందింప
బొమ్మలకు పెళ్లి కప్పమ్మలకు చేసినది.

మందార నీటిలో అందాలు చూచెనట !
చుక్కలకు మాయూర రెక్కలున్నాయంట !
చెందురుడు జారి పడి చిందులాడెను నీట !
మనసల్లె ఆకసము మబ్బు గమ్మిందంట !
పాట లెరిగిన మనకు మాట లెందుకు అంట !
పూటితంబని యంటే పుంతలో రాయిదట !

ఈ తీరుగా ఇంక ఎన్నెన్నొ ఊహల్లు
అమ్మ తన కవితల్లో అందించె, అలరించె!!

# చలం

మట్టి కళ్లతో చూచి నిన్నపుడు
మసక బొమ్మ అనుకున్నాం
కంటి పొరలు చించి చూచిపుడు
మింటి తారకను కుంటున్నాం ॥

నిప్పులాంటి నిజాన్ని చెపితే,
' తప్పు తప్పు ' అనుకున్నాం
ఇప్పటి కది నిజమని తెలిసీ
తప్పు దిద్దు కుంటున్నాం ॥

గాఢ మూఢ నిద్రలో గన్న
కలలు కల్ల లనుకున్నాం
కలలన్నీ నిజమొనర్చిన నిన్ను
గారడి యను కుంటున్నాం ॥

గులక రాయిగా నెంచి నీ లోని
గొప్పనే విస్మరించాం
మేలి రత్న మని గ్రహించి నేడిక
చాలగ దుర పిస్తున్నాం !!

దగ్గరలో నీ వున్నప్పుడు నీ
దరి జేరగ వెరచాం
దవ్వు చాల నీ వేగితివనిపుడు
తపించి పోతున్నాం !!

# బిరుదుల బంగారు రాజు

తన వలె అందరిని ఎంచి
దయ కరుణా ప్రేమ పంచి
గురు కులమై వరలు తేజు
బిరుదుల బంగారు రాజు.

' నాకు గురువు నా సచివుడు
నా బంధువు నా పితరుడు '
అని భక్తిని సన్నుతింతు
అతని పదము లనుసరింతు.

అతని మతము లోక హితము
బుద్ధ క్రీస్తు గాంధి పథము
సత్యం వద ధర్మం చర
నిత్య సూక్తి నిల్పును ధర.

నీతికి నిర్వచన మతడు
నియమావళి ప్రభువతండు
బోధనమ్మ అతని సొమ్మ
బుద్ధికిన్ ప్రచోదితమ్మ.

మోసమన్న దోసమన్న
మోమోట మనేది సున్న
దాని బట్టి చీల్చి తుదకు
ధర్మము స్థాపించు వరకు.

మంచి యనిన మైత్రి నెరపు
చెడుగు చేరదతని పైపు
ఆశ్రిత జన పక్షపాతి
ఆశ్రమ ఋషి పరమోన్నతి.

## చెరుకువాడ వేంకట సుబ్బారావు

అందుకొమ్మ జేజేలు
నందన మందారాలు
సుబ్బరాయ సుబ్బరాయ !
సురు చిర భావాల గేయ !

అందరి హృదయా వరణల
నల్లు కొన్న మల్లె తీవ
తెల్లని నవ్వుల పువ్వుల
తేజరిల్లు తున్న నీవ!

స్నేహమన్న ప్రేమమన్న
చెప్పగలమ నీకు మిన్న
అందు కొరకె కాబోలును
అవతరించినావు ఇలను.

# కోరాడ నరసింహారావు

కోరాడ నీ కీర్తి
కోరకము విరిసెరా
కూర్మి నిండిన ఆంధ్ర
కోటి మది మురిసెరా.

ఏడు కడలులు దాటి
ఎత్తితివి బావుటా
నేడు ధన్యము కూచి
పూడి నీ వల్ల నిట ( అట ).

ఖండాంతరాల నీ
కాలి గజ్జెల మ్రోత
వినిపించెరా ద్యుతులు
వెలిగించెరా దిశల.

అక్షరమ్మగు ప్రేమ
నా శిషము నందింతు
శిక్షణమ్మగు ఆట
చెలువు గణుతింతు !

# ముత్యాల సుబ్బారాయుడు

బాలల హృదయాలు వేలు
పరిమళాల సుగంధాలు
అందుకొనిన మీకు
నా పసందు కావ్యప్రదానం.
ముత్యాల కులాబ్ధి సోమ
సత్యా హింసల సుధామ !

సచ్ఛీలం సమభావం
సర్వ జనులపై ప్రేమం
పాదుగొల్పు పరమశాంత
సాధుగుణ ప్రపూత చరిత.

మీ జాడలు నే నరసితి
మీ గురు పారం పర్యం
మించిన భక్తిని ఎంచితి
మీ దయ నాశించితి.

బుద్ధం సంఘం ధర్మం
శ్రద్ధగ నవలోడనం
చేసికొన్న ప్రియదర్శి
చేకొను నా 'ప్రియదర్శి.'

సాధన మనిషికి సత్యం
సత్యా చరణం సంఘం
సంఘ శ్శ్రేయం ధర్మం !!

# తటవర్తి కృష్ణమూర్తి

పాడనా కొని యాడనా
యమునా తటవర్తి కృష్ణమూర్తి !
అంచ రెక్కల మించు మేల్ తెలి
పుంచు దుప్పటి కప్పుకొని, హావ
ఖోంచు సాగర సామి మది తల
పించు నీ కమ నీయ రూపము.

అందమగు క్రొక్కారు మబ్బుల
కుందనపు జలతారు తీవె ప
సందు చిందుల దోచు నీ మధు
మందహాస విలాస రేఖల.

నీల జలనిధు లీది మును వే
దాల జగతికి పంచి ఇచ్చిన
లీల రూపము దాల్చె మది నా
బాల వేదోద్ధరణ శీలము.

అన్నా రన్నా రెందరొ
విన్నా నిజ మని కన్నా.

ఒడలి రంగొకటే నలుపు
ఎడద విరియు గుణము తెలుపు !
మూడు తరాలొక్క ఇంట
కూడి మీరలుంటిరని,
జాతీయోద్యమమున ని
జాయితి గల వ్యక్తివని,

ప్రతి సంస్థకు నీవె మొదట
ప్రతినిధి గా నిలిచితివని,
సిరి గల వైశ్యుల కుండే
చిన్ని వ్యసనములు లేవని,
ఉచిత వైద్య సేవ ప్రజకు
ఓర్పు మీర చేసితివని,
ప్రేమ చిందు పిలుపు సొంపు
నీమముతో నెరపుదువని,
అన్నా రన్నా రెందరో
విన్నా నిజమని కన్నా.

# డాక్టర్ స్వామి వీరభద్రరావు

ఓ స్వామి మా స్వామి ఉన్నత పథగామి
అందు కొనుము కైవారము అక్షర మణిహారము.
చల్లనిదీ నీ హృది ఎల్లరి కది విడిది
మల్లెలు విరిసే నచట మమతలు కురిసే నచట.
నీతో మాకున్న చెలిమి నిజముగ అది ఒక కలిమి
నీ మతమూ జీవితమూ నిఖిల లోక హితము.
ఎన్నడు మూయని తలుపు మన్నన ఎఱిగిన పిలుపు
సన్నుతి సంపద గెలుపు ఉన్నత పీఠాన నిలుపు.
మానవతా వాదివి అసమానతల విరోధివి
నవ్య భావముల ప్రోదివి భవ్యజీవనాహ్లాదివి.
అమృత కల్పమౌ హస్తము ఆమయ వారణ శస్త్రము
శస్త్రము నీ హస్తమందు సాధించు సమస్తము.

# డాక్టర్ పి. వి. కేశవరావు

కేశవ నామాంకితు డా
వేశ రహితు డున్నతుడు
కనులు తావలము కరుణకు
తలిరు పెడద దయకును.

సంగీత ప్రియుడు హితుడు
సరస వచస్వి యశస్వి
అలసట యనునది ఎరుగని
అనుపమ సేవా తపస్వి.

కవులూ గాయకులూ ఇక
కళా శిల్పు లెందరో
వచ్చి పోవుచుందురూ
వరుస విడక వారింటికి.

మందస్మిత వదనంతో
మధువు చిందు హృదయంతో
లోక జనుల కందరి కా
లోకనమును ప్రసాదించు.

పనుల యందు తన శక్తిని
ప్రస్ఫుట మొనరించు కొనెను
కనుల యందు కరుణార్ద్రము
కామిత మొనరించు కొనెను.

## ఆవుల గోపాల కృష్ణమూర్తి
## కాట్రగడ్డ రాజగోపాలరావు

( అమెరికా రష్యా పర్యటనలు చేసి తిరిగి వచ్చిన సందార్భాన )

కన్నులు రెండున్న నాడు
కాంచ గలము లోతులు
కన్ను ఒక్కటున్ననాడు
కాంచలేము లోతులు.

కావలసిన వీరిరువురు
కనులు మనకు చూచు కొరకు
కుడి నౌకరూ ఎడమ నౌకరు
కుదురుకున్న లోచనాలు.

తీర తీరములను వీరు
తిరిగి చూచి వచ్చినారు
అచటి మంచి విశేషాలు
అన్నిటి నందించుతారు.

కవిరాజును వెల్వరించు
వివిధాశయ విజ్ఞులైన
వీరికి మా స్వాగతమ్ము
హార్దికాభివాదమ్ము !

# త్రిపురనేని వెంకటేశ్వరరావు

కవిరాజ వారసుడ ఘన వైద్యశేఖరుడ
సాహిత్య సమ్రాట్ సరస బిరుదాంకితుడ

షష్ట్యబ్ది ఉత్సవము జరిపించు ఈనాడు
నీ కిడుదు గౌరవాక్షర గేయ విరిదండ

భావ విప్లవ జ్యోతి ప్రతిభతో వెలిగించి
యువతలో చైతన్య నవత రగిలించితివి.

విలువైన విషయాలు వివరించు కావ్యాలు
చక్కగా కూర్చితివి లెక్కలో ఎక్కువగ.

శాస్త్రీయ దృక్పథము చాటి వివరించుటకు
అంధ విశ్వాసాలు అడుగంట జేయుటకు
పట్టుదల గట్టి కృషి వహియించినాడవు.

మమతలో సమతలో మనుషులందరు ఒకటె
అందుచే భేదాలు అసలు కూడదటంచు
సహపంక్తి భోజనాల్ చర్చలూ జరిపితివి.

తొలి జీవితాధ్యాయ తోరమ్ము మించి
మలి జీవితాధ్యాయ మహిత కీర్తిని గాంచు
త్రిపురనేనీ వంశ శ్రీ వేంకటేశ.

# కైకాల సత్యనారాయణ

నీకు జరిపించిరిట స్వర్ణాభిషేకం
నేను జరిపింతు స్వర్ణాక్షరాభిషేకం.

కైకాల నీ పేర ఈ కళా మందిరం
నెనరు కిరపైనట్టి నీ సుహృన్మందిరం.

ఓ యన్న నీకున్న ఇంత అభిమానం
ఒరులెవరు ప్రకటించుటది మేము కానం.

తీవితో దవరు నీ తీయన్ని రూపం
తీర్చిదిద్దిన వెండి తెరకు ప్రదీపం.

నీవు నేనూ పుట్టినాము ఒక యూర
అందు కొరకే కాన్క అందుకో ముదమార.

నీవు నేనూ కళను చేపట్టినాము
చేపట్టి భక్తిమై సేవించినాము.

కలకాల మిల నిలుచు నీ యశస్సు
ఫలియించె నిదె నీ కళాతపస్సు.

# యం. ఎస్. బావాజీ

నీవన్న నాకున్న
నెవరు కిది గుర్తు
సత్త్వ గుణ శీల నీ
సరి నెవరి నెంతు.

నీవు పలికే తీరు
నీ విలువలే వేరు
నిను పోలగలవారు
మన వృత్తిలో లేరు.

బాల సాహితి లోని
పాల మీగడలు
తెచ్చితిని గైకొమ్మ
దీవెనల నిమ్మ.

వయసు పండిన వాక్కు
దయవారు నీ దృక్కు
ఈ చిన్ని కానుకతో
ఎటు గొల్తు ఎటు విల్తు ?

వెల లేని నీ జాడ
విలువ గల నీడ
చిన్ని నా ఈ కృతికి
శ్రీరామ రక్ష !

# జంపాల శ్యామ సుందర ప్రసాదు

జంపాల కులాబ్ధి చంద్రు డను
కంపామృత కీర్తి సాంద్రుడు
శ్యామ సుందర ప్రసాదు నా
ప్రేమ గౌరవాభిమాన సేంద్రుడు ॥

అతి ప్రశాంత మాతని రూపము
అతి మృదుల మాతని భాషణము
ఆలోచనా సరళి అతి గభీరము
అమృత నిష్యంది ఉల్లము తెల్లము ॥

ఆ ఇంటికి అతడొక్కడె పుత్రుడు
ఆతనికిని లేక లేక ఒక పుత్రుడు
తండ్రి చల్లని రూపు మెల్లని చూపు
తనయునిలో నవి పట్టి చూపు

నేడు ఆ విశాల ప్రాంగణములో కాన
రాడు మరొక వ్యక్తి బాయి తప్ప
ఒకనా డా గేహము సుకవి పండిత
సకల కళా కోవిదులకు ఆశ్రయము

ఎందుకో నా మది పరితపించు
సుందర సురుచిర హాసంతో పిల్లలు
కందర్ప బాణాలటు నవమల్లెలు వెలు
గొందే ఘడియకై శుభ ఘడియకై ॥

# పసల సూర్య చంద్రరావు

రమణీయ కళాకృతి రసికజన చక్రవర్తి !
ఉదాత్తానుదాత్త స్వరితోజ్జ్వల స్ఫూర్తి !
పసలాన్వయ సూర్య చంద్ర ప్రాభవ గుణసాంద్ర
సూరిజన సన్నుత హిత సువిచార నాట్య కళాపార !

నీ మందిరము రసరాణ్మణీ సుహృ
న్మందిరము నవ్య భవ్య నందనము
అల పాదుషాయీ ప్రణయ ప్రతిభ
స్వాదు కవితా రస ధునీ ధనము ॥

వక్రోక్తి చతురోక్తి వరలు భాషణము
వ్యంగ్యమునకూ ధ్వనికి విభూషణము
ఆరోహణావరోహణల గాన లహరి
అవధరించును రస నవకమునకు దరి
నవ నాట్య శ్రీరుచుల వనలు దేరిన సరళి
నవ నవోన్మిషము నీ పేరోలము రవళి ॥

మాన్య మహాశ్రీ మామక స్నేహశ్రీ
మాధుర్యో ధుర్య లలితశ్రీ మంజుశ్రీ
అక్షయము యౌవనము అద్దిన వర్చస్వీ
అది నీ జన్మ సుకృతము అరుదైన వచస్వీ

పసలాన్వయ సూర్య చంద్ర ప్రాభవ గుణసాంద్ర
సూరి జన సన్నుత హిత సువిచార నాట్య కళాపార !!

# వేగుంట కనక రామ బ్రహ్మము

అతడొక్క సువ్యవస్థ అతడు మహా సంస్థ
అవిరళ సేవా తత్పరతాతని ఆస్థ.

అమృతమూర్తి అమలకీర్తి అతడజాత శత్రుడు
అన్ని తరాల ప్రజలకు అతి దగ్గర మిత్రుడు.

మధుర మంజులం మార్దవ మతని నోటి మాట
మానవ కల్యాణ కాంక్ష మలచు కొన్న బాట.

కవుల కనులలో తారగ గళముల సుమ హారముగ
గణుతికెక్కి వారి కృతి స్వీకృతి నందెను ఘనముగ.

లెక్కకు మిక్కిలి సంస్థలు అవి తన ప్రియ సంతతి
చిక్కులు తీర్చే తీర్పరితన మాతని ప్రకృతి.

అతిథుల నే వేళ ప్రేమ నాదరించు కల్పవల్లి
అమృతవల్లి ఈశ్వరమ్మ అతని సతీమతల్లి.

అతడు వేగుంట శ్రీ కనక రామ బ్రహ్మము
ఆత్మీయుండగుట నాకు ప్రాణమునకు ప్రాణము.

# రావూరి అర్జునరావు, మనోరమలు

( ఆదర్శ దంపతులు- -గుడివాడ )

మనోరమా శ్రీ అర్జునరావులు
మాన్యశ్రీలాదర్శ దంపతులు
ఆమె, తొలి బిడ్డ శ్రీ గోరాకు
ఆతడంకితుడు, గాంధీ సేవకు ॥

దాంపత్యమ్మన వారిదె కన
దర్శనీయ మానంద నందనము
సేవా నీమము సేవా ధర్మము
పావన జీవన పరమార్ధమ్మన ॥

స్వాతంత్ర్యోద్యమ శుభ్ర వర్తనులు
స్వచ్ఛంద సేవా నిరతులు హితులు
సంస్కరణోద్యమ రథ సారధులు
సదాచార సంపన్ను లుత్తములు ॥

భార్య యన్న ఆ యమను భార్యగా
భర్త యన్న ఆయనను భర్తగా
అనుపమాన సంతతిగ వారి
ఐదుగురు బిడ్డల బేర్కొనాలి ॥

వ్యాకులము లేని కులము వారిది
హితము సర్వ సమ్మతము మతము
చల్లని మెల్లని వారిరువురి హృది
సకల జనుల కాశ్రయము విడిది !!

# పసి హృదయం

అమ్మడు కూర్చుంది పటము కెదురుగ ఎదురుగ
గుమ్మడి పువ్వల్లె చాల కుదురుగ కుదురుగ.

కన్నులు మూసింది రెండు కరములు మోడ్చింది భక్తి
భావము రూపందిన ఒక భవ్య దివ్య ప్రతిమ వోలె.

తమ్ముడు తన కీ ప్రక్క చెల్లెలు తన కా ప్రక్క
కిమ్మనకుండా ఇద్దరు బొమ్మల్లాగమరినారు.

అమ్మడి పసిహృదయం అది అవ్యాజం నైజం
ఆరాధన ఆవేదన కది నిలయం వలయం.

చక్కగ చదువూ మార్కులు ఎక్కువగా రావాలని
వలుగురు నను మెచ్చాలని నన్ను నీవు దీవించు
మమ్మీనీ డాడీనీ మరి గ్రాండ్మమ్మీడాడీ
లందరినీ దీవించు ఆరోగ్యంగా ఉంచు

అందరి కంటే ముందుగ ఎందుకైన నిన్ను నీవు
దీవించుకొనీ పైనా దీవించెందరినైనా
నీకేమైనా జరిగితె నిను రక్షించేదెవరు ?
నీకె రక్షణ లేకుంటె ఇంక మము రక్షించేదెవరు ?

# నీ చేసిన బొమ్మలు కారు

నీ చేసిన బొమ్మలు కారు
నీ కడుపున కలిగిన వారు
మాటాడక కూర్చుండుటకు
మరి కదలక పడియుండుటకు.

ఒక మార్గం మాత్రము నీవు
ఒక గమ్యం వారికి కావు.
ఊహలు ఉన్నవి వారికి
ఉన్నతిని చేరడానికి.

కోరకు నీ వలె వారిని
కూర్చి తీర్చి ఉంచాలని.
కోరి యత్నించు వారిని
గొప్ప ననుకరించాలని.

వంగిన విలు నీ తీరు
వదలిన బాణాల్ వారు
జీవిత మటులే నిరతం
భావి వైపు జను త్వరితం.

వారి తనువులవి వసించుకొరకై
వసతు లెన్నో సమకూర్చగలవు
వారి తలపులవి వాసించుటకై
వసతులేమి సమకూర్చ లేవు.

# నా కొలిచే దేవుళ్లు

నా కొలిచే దేవుళ్లు పసివాళ్లు
గుండె గుడిని నిండుగ కొలు
వుండిన దేవుళ్లు పసివాళ్లు

ఈ లోకం శోకం ఈ మోసం దోసం
ఈ పాపం శాపం సోకని వాళ్లు తాకని వాళ్లు

పలుకుల్లో పారిజాత పరిమళాలు కురిపించే
కులుకుల్లో కోటి వెలుగు తారకలను మరిపించే
నిద్దపు మనసులవాళ్లు ముద్దుగుల్కు దేవుళ్లు

అంతరంగ మందాకింత చింత చీకు చేరనీని
పంతాలకు పోయి బ్రతుకు పాడు బీడావర్చుకోని
చిద్విలాస చిదానంద చిన్మయ రూపులు వాళ్లు

వాన విల్లు వంతెనలా వన్నెల వెన్నెల బంగరు
రంగుల రంగుల ఊహల రహించు రస రేఖలా
మంటికి మింటికి అద్భుత మార్గము నిర్మించువాళ్లు

# అమ్మా నా నాన్న

అమ్మా నాన్నా అతి సామాన్యులు
ఆదరణ ప్రేమ నసామాన్యులు
చదువు రాదు సారస్య హృదయులు
ఎదలో భేదము నెరుగని సదయులు ॥

కల్లా కపటం తెలియని దమ్మ
కష్టజీవి సజ్జనుడు మా నాన్న
జన్మనిచ్చిరి జగతిని జూపిరి
నన్ను జూచి తామెంతో మురిసిరి ॥

పెద సుబ్బమ్మ పెద సుబ్బయ్య
పేరులు మా తలిదండ్రులవి
వారి ఋణము నే దీర్చుకొందును
వారి మార్గమును అనుసరింతును !!